# అఱువది యెనిమిదవ ప్రకరణము



## ఉద్బోధనము

"సమాస్త్వాగ్న ఋతవో వర్ధయంతు సంవత్సరా
ఋషయో యాని సత్యా, సందివ్యేన దీదిహి
రోచనేన విశ్వా ఆభాహి ప్రదిశశ్చ తస్రః."

—అథర్వణసూత్రము.

"భూరిప్రయత్నముచే యథాశక్తి మనుష్యుఁడు తన సమయమును సద్వినియోగముచే ననుకూల మొనరించుకొనుచు ఋషులనుండియు, బుద్ధిమంతులగు నాప్తులనుండియు నుత్తమ శిక్షను గ్రహించుచు సత్యసంకల్పయుతుఁడయి, సత్యసంధుఁడయి, సత్కర్మపరాయణుఁడయి విశ్వమునం దభివృద్ధిఁగాంచి యశస్వియయి, ప్రసన్నచిత్తుఁడయి యుండుగాక !"

ప్రేమాస్పదులగు విద్యార్థులారా! ఇంతవఱకు "మానవజీవితము" అను నీ గ్రంథమునఁ బ్రథమ ప్రకరణంబాది యంతిమప్రకరణముపర్యంతము నాదర్శ మానవజీవితోచితములగు బహుధర్మములనుగూర్చి ముచ్చటించి యుంటిని. భువి యథార్థములగు సౌఖ్యానందములఁ బడయ నభిలషించు ప్రతి విద్యార్థియు నిందలి ధర్మములనెల్ల ధ్యానముతోఁ బఠించి తదనుకూలముగ జరిత్రనిర్మాణ మొనరించుకొనఁదగును. కేవల మిందలి భావములఁ బారాయణ మొనరించి యాచరింపనిచో నీ గ్రంథముచే నెట్టి ప్రయోజనము కలుగనేరదు.

ఈ గ్రంథమున వ్రాయఁబడిన ప్రతివాక్యము విద్యార్థి యొక్క నైతిక జీవితపురోభివృద్ధినే ధ్యానమునం దిడికొని యున్నది. మానవజీవితోత్థానమున కావశ్యకమగు సామగ్రి యంతయు నీ గ్రంథమునఁ జేర్చఁబడియున్నది. ఇందలి ప్రతి వాక్యమును జీవితాభ్యుదయమునకుఁ దారకమంత్రమయి రాణింపఁగల దని భావించుచున్నాఁడను.

విద్యార్థులారా! మీరు ధర్మపరాయణులయి, పవిత్ర హృదయులయి, ప్రేమానందమయులయి, విజ్ఞానధనులయి, నీతిధురీణులయి, విద్యావిశారదులయి స్వచ్ఛంద జీవితానంద సాగరమున నోలలాడఁదలంతురేని పవిత్రగ్రంథమగు 'మానవ జీవితము'నఁ గల ప్రతి నీతివాక్యమును దివారాత్రములు స్మరించుఁడు. ఆచరించుఁడు. ధన్యులగుఁడు.

సద్వాక్యముల శ్రద్ధతో నాలించి, త్రికరణశుద్ధితో ననుష్ఠించియే సామాన్యమానవులు ప్రతిభావంతులయి, ప్రజ్ఞానముపేతులయి, మహాపురుషు లను ప్రఖ్యాతి వహించి తమ యశశ్చంద్రికల నాచంద్రతారార్కస్థాయిగ దిగ్దిగంత ముల వ్యాప్త మొనరింపఁజేయఁగల రను రహస్యమును విస్మరింపకుఁడు.

నిశ్చయముగా విద్యార్థిహితము నపేక్షించు "మానవ జీవితము"న వెలయు నొక్కొక్క ధర్మ మనుష్ఠింపఁ బడినం తనే మీ వికాసశూన్యములగు దుర్బలహృదయముల స్వర్గీయ తేజముచే నింపివేయఁగల దని విశ్వసింపుఁడు. నాయనలారా! వ్యర్థములగు విలాసములకు వశులయి, వాని పరిణామము లగు దుఃఖభయరోగములచే బాధింపఁబడక జ్ఞానపూర్వక

మగు సాధుజీవిత నిర్వాహణమునఁ దగిలియుండుఁడు. సచ్చారిత్రము స్వర్గీయసంపద యని తెలియుఁడు.

మీరు సద్గుణశీలురయి, వినయవిధేయతామూర్తులయి, ధీరులయి, ధీమంతులయి, కర్మవీరులయి, లోకోపకారపారీణులయి, విద్యావంతులయి మనుచుండురేని భూతలము స్వర్గతుల్య మగును. మన దేశముయొక్క బంధమోక్షములు రెండును మీమీఁదనే యాధారపడి యున్నవి. సద్వర్తనులయి, సుజ్ఞానులయి, మహాత్ములయి దేశము నుద్ధరించుటకును, దుష్టచారిత్రులయి, అజ్ఞులయి, దురాత్ములయి జన్మభూమిని పాదదళిత మొనరించుటకును మీరే సమర్థులు. స్వర్గనరకములఁ గల్పించు నీరెంటిలోఁ దొల్లింటిదగు దేశభక్తియే మీకుఁ బ్రాణసమానమగుఁగాక !

నాయనలారా! దయామయుండగు పరాత్పరుఁడు మీకొఱకు స్వర్గద్వారములఁ దెఱచియున్నాఁడు. జ్ఞానమార్గము ననుసరింతురా స్వర్గపురినిఁ జేరి సుఖింతురు. అజ్ఞానపథము ననుగమింతురా నరకకుండమునఁబడి దుఃఖింతురు. కావున, మీరలసుల కావలదు. అజ్ఞాననిద్రనుండి మేల్కొనుఁడు. భోగులగుటకు వాంఛింపకుఁడు. యోగు లగుఁడు. భారతభూమి జ్ఞానభూమి - కర్మభూమి యను మాతృదేశప్రఖ్యాతిని మలినము గాకుండ సంరక్షింప దీక్షితులగుఁడు.

లోకమున జగదీశ్వరుని పవిత్రశాసనములగు దయ, అహింస, శౌచము, నిగ్రహము, శాంతము, జ్ఞానము, భక్తి మున్నగు వానిని సత్వరము పాలింపుఁడు. దైవశాసనపాలకులే నిర్భయులయి, నిశ్చయచిత్తులయి, ఆనందమూర్తులయి, బాల

భానుని పగిదిఁ బ్రకాశింపఁగలరు. కర్మవీరులయి ధైర్య స్థైర్యములచే సత్యమునకయి బలిదానమగుఁడు.

ధరణి ధ్వజమును స్థాపించ వాంఛింతురేని ధర్మవైజయంతినే శాశ్వతప్రతిష్ఠాపిత మొనరింపుఁడు. ధురంధరులు కాఁగోరుదురేని శీఘ్రమే ధర్మధురంధరులగుఁడు. చింతానిరతులగుట కభిలషింతురేని సత్యజీవిత ప్రాణచింతనానిరతులగుఁడు.

మీపూర్వులవలెఁ బుణ్యమూర్తులు కాఁదలంతురేని జ్ఞానము నార్జింపుఁడు. శాశ్వతముగ వసుధ శతవత్సరములు మూఢులయి జీవింపఁగోరుటకంటె స్వల్పకాలమేనిసుజ్ఞానులై మనుటకుఁ గోరుకొనుఁడు. అపుడే మీ విద్యార్థి నామము సార్థకమగును.

మనుష్యుఁడు జననమాదిగ మరణ పర్యంతము విద్యార్థియేయను రహస్యమును మఱువకుఁడు. సచ్చిదానందుఁడును, లోక కల్యాణకరుఁడును నగు జగదీశ్వరుఁడు మిమ్ము మహాపురుషులుగను, స్వార్థత్యాగులుగను, కర్మవీరులుగను, ధర్మమూర్తులుగను జీవింపఁ బ్రోత్సహించునుగాక!

"మానవజీవితము" మి మ్మాదర్శమానవులుగ సిద్ధమొనరించుఁగాక! మీ మోక్షమునకు మీరే కారకులగుదురు గాక!

"స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం
న్యాయేన మార్గేణ మహీం మహీశాః
గోబ్రాహ్మణేభ్యః శుభ మస్తు నిత్యం
లోకాః సమస్తా స్సుఖినో భవంతు."

